న=యుద్ధములేమిచేత;సీతాం = సీతను;ప్రాప్య=పొంది;కృతకార్యః = చేయఁబడినకార్యముగలవాఁడనై ; త్వయాసహ=నీతోఁగూడ;లంకాంప్రతి= లంకనుగూర్చి; గమిష్యామి = పోయెదను.

ఈప్రకారమున రామునివంచించి,యుద్ధంబుసేయవలసినదిలేకయె,సీతనపహరించుకొని, కృతార్థుఁడనై , నీతోఁగూడలంకకుంబోయెదను.

అని, తాత్పర్యము.

నచే త్కరోషి మారీచ హన్మి త్వా మహ మద్య వై
ఏత త్కార్య మవశ్యం మే బలాదపి కరిష్యసి. ౨౭

టీక॥ మారీచ=మారీచుఁడా! నకరోషిచేత్=చేయవేని;అహం= నేను; త్వాం=నిన్ను;అద్యవై= ఇప్పుడె; హన్మి=వధించెదను.మే = నాయొక్క; ఏతత్ =ఈ;కార్యం=పనిని; అవశ్యం= అవశ్యముగా;బలాదపి= బలాత్కారమువలననైన;కరిష్యసి= చేయఁగలవు.

మారీచుఁడా ! నీవీకార్యముసేయవేని, నేనిప్పుడేనిన్నువధింతును ; అవశ్యముగా , బలాత్కారంబుననైనను, నీచేతనీకార్యముఁ,జేయింతును.

అని, తాత్పర్యము.

రాజ్ఞో హి ప్రతికూలస్థో నజాతు సుఖమేధతే

టీ॥ రాజ్ఞః= రాజునకు; ప్రతికూలస్థః= ప్రతికూలముగానుండువాఁడు; జాతు=ఒకానొకప్పుడును;సుఖం= సుఖమును;నైధతే=పొందఁడు.

రాజునకుఁబ్రతికూలముగా నుండువానికెప్పటికిని సుఖముగలుగదు.

అని, తాత్పర్యము.

ఆసాద్య తం జీవిత సంశయ స్తే
మృత్యు ర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య. ౨౮
ఏత ద్యథావ త్ప్రతిగృహ్య బుద్ధ్యా
యదత్ర పథ్యం కురు త త్తథా త్వమ్




టీక॥ తే=నీకు;తం=ఆరాముని; ఆసాద్య=సమీపించి ; జీవితసంశయః=ప్రాణసందేహము. అద్య=ఇప్పుడు; మయా=నాతో;విరుధ్య = విరోధించి; మృత్యుః=మరణము;ధ్రువోహి= నిశ్చితముగదా! ఏతత్=దీనిని ; యథావత్=సరిగా;బుద్ధ్యా=బుద్ధిచేత ; ప్రతిగృహ్య=తీసికొని;అత్ర=ఇందు ; యత్=ఏది;పథ్యం=మేలో;తత్= దాని; త్వం=నీవు;తథా=అట్లు;కురు = చేయుము.

నీవుఆరామునియొద్దకుఁ బోవుదువేనిమరణంబుగలుగుటసందేహము; ఒకవేళఁదప్పినను దప్పవచ్చును ; నాతోవిరోధింతువేని యిప్పుడె మరణంబుగల్గును;ఇదినిశ్చితము; నీవిరెంటినిజక్కఁగానాలోచించి,నీకేదిహితమో దానిఁగావింపుము. అని,రావణుండు , మారీచునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే,చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,ఆరణ్యకాండచత్వారింశసర్గటీక,
ముగిసినది.






